Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం॥ ఫిబ్రవరి నెల 6 వ తేది శుక్రవారం [నె 5 రు.

## ఈవారంలో యుద్ధం

### ఉత్తర ఆఫ్రికాలో తారుమారు—ఇతోపియా ఇంగ్లాండు ఒడంబడిక—రష్యా సేనలు త్రోసుకపోవుట—మార్షలు, గిల్బర్టు దీవులందు జపాను ఓటమి.

### ఉత్తర ఆఫ్రికా.

ఉత్తరాఫ్రికాయందు జర్మను సైనిక దళాధికారి యగు జనరలు రోమెలుగారికి అదనంగా క్రొత్త సైన్యం సరకు వచ్చినట్లుంది. వాటిని పూర్తిగ ఉపయోగించి అతడు లాభం పొందుచున్నాడు. బెంగాజి రేవును వశపరచుకొన్న తరువాత అతని టాంకుదళములు ఈశాన్యంగా పోయి బార్సి, ఎల్ అబియార్ పురములను ఆక్రమించుకొనెను. బెంగాజియందుండిన భారతీయ ఇన్‌ఫెంట్రీ బ్రిగేడు సేనను చుట్టివేసి ఖైదు చేయాలని అతడు చూచెను. కాని వారు అత్యద్భుతముగ తప్పించుకొనిరి. అంత సాహసం చేసినందుకు బ్రిటిషు సేనాధికారి జనరలు అచినులేకుగారు భారతీయ సైనికులను అభినందించెను. ఈ ఇండియను బ్రిగేడు దళము నాల్గవ భారతీయ డివిజన్ను చేరుకొనెను. ఈ డివిజను జబెలు అక్దరువద్ద శత్రువు ఒత్తిడివలన వెనుకకు తగ్గుచున్నది.

దీనికి కొంచెం దక్షిణంగా బ్రిటిషు సంచార సైనికదళము మిసనునకు ఈశాన్యంగానుండి శత్రువు కనబడిన చోట్లనెల్ల ఎదుర్కొనుచు దాడి కొనసాగించుచున్నది. బెంగాజిలో విమానాశ్రయం క్రొత్తగా వశమయినందున జర్మను విమాన దళం దానిని బాగుగ ఉపయోగించుచున్నది. అయినా బ్రిటిషు విమానదళందే పైచేయిగానుంది. శత్రువులమోటారుదళములు, టాంకులు, సైన్యాలు, చమురు మోసుకపోయే వాహనాలు, సిరనైకాయందును ట్రిపోలిటానా రాష్ట్రంలో ట్రిపోలి రేవువరకును అడుగడుగున అమర్చియుంచబడియే యున్నవి. సిరినైకాలోనికి జనరలు రోమెలుగారి సేన చొచ్చుకొని రాకుండ నిలిపివేయబడెను. బెంగాజీకి దక్షిణంగానున్న అగడాబియా నగరానికి ఈశాన్యంగానూ త్రికోణాకారంగాగల ఎడారి భాగంలో రోమెలుగారి మూడు శాఖముల టాంకు దళములను బ్రిటిషువారి మోటారు దళములు, శాల్బలము, విమానములు ఎదిరించి తీవ్రయుద్ధం జరుపుచున్నవి. యుద్ధగతి క్షణక్షణం మారుచున్నది. ఈ యుద్ధమే కడపటి విజయమును నిర్ణయించు యుద్ధం కాగలదు. ఎదుర్కొన్న ప్రమాదం యిరు పక్షములవారు గుర్తించిరి. ముఖ్య శ్రేణినుండి మనం వెనుకకు తగ్గితిమన్న విషయం దాచియుంచుట మేలని ఎవ్వరనుకొనరు. సైనికులు చలోక్తిగ చెప్పుకొనునట్లు రోమెలు సేనాని యిపుడు మనలను నడుంబిగించకముందే కొట్టుకున్నాడు. మన సైన్యాలాతన్ని కొట్టాలని సిద్ధపడుచుండెను. అది ఆతను గ్రహించి ముందే దెబ్బకొట్టెను. గత నవంబరులో మనమాతన్ని కొట్టినట్లే యిపుడాతడు మనలను కొట్టెను. అపుడాతని సైనికదళం వెనుకకు మరలినట్లే యిపుడు మనదళం వెనుక తగ్గెను. అపుడాతని సప్లైలు రక్షింపబడినట్లే యిపుడు మనవి భద్రంగానున్నవి.

### అబిసీనియా-ఇంగ్లాండు ఒడంబడిక.

ఇతోపియా (అబిసీనియా) చక్రవర్తితో బ్రిటిషు ప్రభుత్వంవారు యీ వారం సంధిచేసుకున్నారు. తిరిగి ఆ రాజ్యంతో రాజకీయ సంబంధం ఏర్పరచుకొనిరి. ఇతోపియా ముఖ్యపట్నమగు అడిసు అబాబాలో బ్రిటిషు రాయబారిగా ఆర్. ఓ. హోవుగారు నియమింపబడిరి. రెండేండ్లలో ఇతోపియాకు ఇంగ్లాండు 2,500,000 సవరలు మదుపుపెట్టును. బ్రిటిషు సలహాదారులను కొందరు ఉద్యోగులను తమ దేశపరిపాలనావిధానం పునస్థాపన చేయుటయందు తోడ్పడుటకై పంపమని ఇతోపియా చక్రవర్తి కోరెను. వారు పంపబడుచున్నారు. ఇతోపియను సైన్యాలను తిరిగి ఏర్పరచుటకు ఇంగ్లాండునుండి సైనిక సలహాదారులనుకూడ చక్రవర్తి కోరెను. ఈ ఏర్పాటులన్నింటికిని అవసరమయినంత బ్రిటిషు సేన ఇతోపియాలోనుంచుటకును సైనిక ఒడంబడికయొకటి సంతకము లైంది. ఇతోపియా యుద్ధంలో ఇటలీనుండి దొరకిన సరకులు ఆయుధాలతో ఇతోపియా సైన్యం సమకూర్చబడును.

### రష్యా విజయాలు.

రష్యాలో అన్ని యుద్ధరంగాలందును రష్యను సేనలు ముందుకు చొచ్చుకొని పోతూ ఒకవూరు తరువాత నొకవూరును శత్రువులనుండి విడుదల చేయుచున్నవి. లెనిన్‌గ్రాడు నగరాన్ని వదలరాదని రష్యనులు చాల ప్రయత్నించుచున్నారు. జనరలు జుకోవుగారి నాయకత్వమున రష్యనులు ఇల్మను సరస్సు దక్షిణంగా గెలిచిన ప్రదేశమంతా స్థిరపరచుకొంటున్నారు. లెనిన్‌గ్రాడు నగరం చుట్టునున్న జర్మనులపైకి దాడి వెడలుటకు సిద్ధమగుచున్నారు.

మధ్యరంగమున స్మోలెంస్కునుండిగల రాదారిమార్గంలో జర్మనులు రష్యాబాడినుండి తప్పించుకుంటున్నారు. లెనిన్‌గ్రాడునుండి తెల్లరిష్యా వరకుగల ప్రధానరైలు మార్గమును రష్యనులు వశపరచుకొన యత్నించుచున్నారు. దక్షిణమున రష్యా సేనానిమార్షలు టిమోషెంకోగారు ఉక్రైను దాడి ప్రారంభించెను. ముఖ్య పారిశ్రామిక నగరమగు కార్కోవుపరకు సాగిపోతున్నాడు. ఒక దళం ఉక్రైను వైపునకు, యింకోదళం నల్లసముద్రం ఈశాన్యకొననున్న అజోవు సముద్రం వైపుకు పంపుచున్నాడు. అజావు సముద్రతీరాన్నవున్న టాగనురాగునగరానికి 100 మైళ్లు పడమరగనున్న బెరిస్టావాయి రష్యనుల వశమయింది. క్రిమియా ద్వీపకల్పమునకు తూర్పుతీరాన ఉన్న ఫిడోషియానుండి వారు విరమించినమాట నిజమే. కాని అయినను కాకసను రాష్ట్రంనుండి కెర్చి జలసంధిమీదుగ క్రిమియాలోనికి వచ్చుటకు వారికి అవకాశం గలదు. క్రిమియా ముఖ్యపట్నమగు సిబాస్టపూలు రేవునగరం ముట్టడిచేసిన జర్మనులను వెనుకవచ్చి కొట్టుటకే వారు ముందు ఫిడోషియాకు వచ్చియుండిరి. ఆ కార్యం నెరవేరింది. సిబాస్టపూలులోనున్న సైన్యం ముట్టడి చేసిన సైన్యాన్ని తిరిగికొట్టినది. మార్షలు టిమోషెంకోగారు క్రిమియాను మాత్రమేగాక డానెట్జి లోయలోని పరిశ్రమ లన్నింటినికూడ రక్షింపదలచెను. అందున్న బొగ్గు, ఇనుము గనులు, తూర్పు యుక్రైను రాష్ట్రంలోని పెద్ద నగరాలను, మాస్కోనుండి అజోవు సముద్రంవరకుగల పెద్దమార్గమునుగూడ జర్మనులనుండి తప్పించాలని ఆతనియత్నము. ఈ మార్గమునే చలికాలం అంతా తన వశమందుంచుకోవాలని హిట్లరు యత్నించెను. లెనిను

గ్రాడు, మాస్కోనగరాల ముట్టడిలో వలెనే యిచ్చటగూడ శత్రువుఓడింపబడే సూచనలుగలవు.

### పశిఫికు యుద్ధరంగం.

పశిఫికు రంగమున యుద్ధమునుండి యీవారంలో మంచివార్తలు చెడ్డవార్తలుగూడ వస్తున్నవి. మలయా దేశంలోని యుద్ధంముగిసి, సింగపూరుయుద్ధం ప్రారంభమయింది. మన సేనలు మలయానుండి సింగపూరు దీవికి మరల్చబడిన పిదప జహోరువంతెన పడగొట్టబడెను. శత్రుసేనలు మలయాలో దక్షిణ భాగమునకు పరుగిడివచ్చి సింగపూరుపై దాడిచేయ నుంకించుచున్నవి. విమానదాడులు అతి తీవ్రముగా జరుగుచున్నవి. కాని సింగపూరు ప్రజలూ సైనికులు చాల ధైర్యంగా నున్నారు. తగిన విమానబలం కలదు. సింగపూరు ఫిరంగులు ప్రపంచమంతటిలో పెద్దవి. అవి కాలవ అవతలను జహోరులోనున్న శత్రుసేనలను పిప్పి చేయుచున్నవి.

సింగపూరులోని ఆస్ట్రేలియా ఇంపీరియలు సేనకు ఆ దేశమంత్రి ఫోర్డుగారు యిట్లు సందేశ మంపిరి:—"వీలగునంత ఎక్కువ సహాయం అతి వడిగా మీకు చేరునట్లు చేయవలసిన కృషి అంతా చేసితిమి. ఇష్టంలేని దుకాణదారుడు పంపించు కొద్ది మూటలవలెకాక, ఆయుధ సహాయము పెద్ద వరదవలె వచ్చిపడును. పెద్ద యెత్తున కార్యములు జరుగుచున్నవి. మీరు ఒంటరిగ విడువ బడరు. మిత్రమండలి దేశాలన్ని మీ వెనుక నున్నవి. వారి సంపదంతా మీకు వడిగ పంప బడును. వ్యవధియిస్తే బ్రతుకలేమని తెలిసే శత్రువు అతివడిగా గెలుపొందాలని తొందరపడుచున్నాడు. ఈ సందేశముద్వారా మీ దేశీయులందరి జోహారులు మీకందజేయబడుచున్నవి. మా సర్వశక్తుల సహాయం మీ కర్పించుటకు బాసగా యీ సందేశమును స్వీకరింపుడు. మిత్రమండలికి అపుడే మీరుకొంత వ్యవధిచేకూర్చిరి. మీకు జయ మగుగాక."

సింగపూరును రక్షించి జపానీయులను మలయా నుండియు, ద్రోహంచేసి దొలుతొల్త ఆక్రమించిన యితర ప్రాంతములనుండియు తరిమివేయుటకు మిత్రమండలిదేశాల స్థిరసంకల్పము యీవారం జపానువారివగు మార్షలు దీవులు గిల్బర్టు దీవులపై అమెరికా పశిఫికు నౌకాదళం దాడిచేయుటవలన రుజువయ్యెను. అచట తమకు చాల నష్టంకలిగినట్లు జపానువారే అంగీకరించిరి. జపాను సింహద్వారంవద్దకే యుద్ధాన్ని మరల్చుటకు తమ నౌకాదళంలో ప్రతినౌకను ఉపయోగిస్తున్నామని అమెరికా నౌకాదళ నాయకుడు అడ్మిరలు నిమిట్జి గారనిరి. అమెరికా నౌకాదళం ఎక్కడనుండో తెలియక గిజగిజలాడిన టోకియో ప్రభుత్వమునకు, యిపుడకస్మాతుగా యీదళం దాడిచేయుట గాభరా కలిగించగలదు.

ఆస్ట్రేలియాకు, డచ్చితూర్పు దీవులకు నౌకామార్గమగు మకాసరు జలసంధివద్ద (బోర్నియో—సిలిబీసు దీవులమధ్య) శత్రునౌకలపై అమెరికా "కోట" విమానాలు తీవ్రమగు దాడిసలిపి ఎక్కువ నష్టం కలుగజేసినవి. అంబాయినా దీవియందు జపానుదాడికి తీవ్రనిరోధం కలుగుచున్నందున, యిపుడు జావాదీవిపై మరలిరి. కాని అచటనున్న బ్రిటిషువారి నౌకాశ్రయంపైని వారి ప్రథమదాడి, తాయిలాండు ఇండో-చీనాలపై బ్రిటిషు విమానాలు జరుపుచున్న విమాన దాడులంత జయప్రదంగా లేదు.

రంగూను రేవును, బర్మారోడ్డును రక్షించుటకు రాయలు విమానదళమును అమెరికను విమానదళమును (ఎ.వి.జి.) చేయుచున్న కృషిని చర్చిల్ ప్రధాని కొనియాడెను. 1940 లో ఇంగ్లండు రక్షణ కార్యమువంటిదే యిదికూడాననిరి. బ్రిటిషు సేనలు బర్మాలో మోల్మేను నుండి మరలిపోయి సాల్వీనునది దాటినవి. జపాను సేనలు ఆ నది దాట లేక పోయినవి బర్మాలోని మన సేనకు యింకా యెక్కువ సహాయసేనలు పంపబడునని చర్చిల్ గారు వాగ్దానంచేసిరి. చీనానుండి కూడ విశేషంగా సేనలు వస్తున్నాయని చీనా అధికారి ఒకడు చెప్పెను. చీనాలో దక్షిణమున జపానుసేనలు కాంటనువరకు మరలి పోవలసివచ్చెను. ఉత్తరమున గూడ కొంత స్థలం వదలుకొనిరి.

పశిఫికు సముద్రంలో డచ్చివారి బోర్నియోను అంతా ఆక్రమించ జపానుసేనలు ప్రయత్నించెను. కాని తీవ్రనిరోధం కల్గుచున్నది. ఫిలిప్పైను దీవులలో ఆకస్మికదండు నుపయోగించి బాటను ద్వీపకల్పమును ఆక్రమించుటకు చేసేయత్నాలన్నింటిని అమెరికా సేనానాయకుడగు మకార్థరుగారు, వారిసేన పడగొట్టెను. జపానువారు మకార్థరుగారిని లొంగిపోవలెనని ఉత్తరువు చేయగా ఆతడు తృణీకరించెను. ఫిలిప్పైను అధ్యక్షుడు కుజానుగారు మకార్థరుగారికి అండగనుండి చివరకు మిత్రమండలి సేనలే గెలువగలవని నమ్మకంగా చెప్పెను. పశిఫికు యుద్ధరంగమునం దన్నిప్రాంతాలలో అతి వడిగ యుద్ధం ముగించాలని జపానువారు తొందర పడుచున్నారు. గంట గంటకు మిత్రమండలి శక్తి ఎక్కువగుచున్నదని, క్రొత్తసేనలు సరకు వచ్చుచున్నవని వారికి తెలుసును. అంతవరకు జపాను దాడి ఎదిరింపబడి నిలిపియుంచబడునని నమ్మవచ్చును.

---

# సముద్ర సింహాలు!

## అక్షయపాత్ర రాజ్యాలు.

గుర్రాలు మెట్టమీద బ్రతికే జంతువులు. కాని నీటి గుర్రాలుకూడా ఉన్నాయి. సింహం కేవలం మెట్టమీదతిరిగే మృగరాజు అనిమాత్రమే చదువుకున్నాము. కాని, బ్రిటిష్ సింహం కేవలం మెట్టమీదమాత్రమే తిరిగేదికాదు. అది మెట్టమీద ఎంత బలపరాక్రమంగలదో, నీటిమీద కూడా అంత బలపరాక్రమం గలది. బ్రిటిష్ సింహంమీద యీ రోజున అక్కడక్కడ యితర జీవరాసులు తిరుగుబాటుచేసి ఎదిరిస్తున్న మాట నిజమే. ఒక్కసింహాన్ని సంహరించడానికి అల్ప మృగాలు తండోపతండాలుగా రావలసివస్తోంది. కాని, ఒక్కమాటఆలోచించండి. సింహాలుకూడా మందలుగావస్తే ఇతరజాతి మృగాలు ఎంత అపార పారావారంగా వచ్చినప్పటికీ, కించిత్తు ప్రయోజనం ఉండదు. కాని, సింహాలు రెండుమూడుగాగాని, జట్లు జట్లుగాగాని కదలిరావు. సింహాలు అట్లా కదలివస్తే అది ప్రళయకాలమే. అడవి ఏనుగులుగాని, గుర్రాలుగాని, తోడేళ్లుగాని గుంపులు గుంపులుగా బయలుదేరి అరణ్యాలలో తిరుగుతూ ఉంటాయి. సింహంజాతి అట్లా జట్లు జట్లుగా తిరిగేదికాదు. ఎందుచేత అని అడగండి? అమిత బల పరాక్రమంగలవాడు అతి నిర్భయంగానే ఉంటాడు. తాను ఒక్కడే పెక్కుమంది శత్రువులకు జవాబు చెప్పగల్గుతాడు. సహజసిద్ధంగా స్వయంసమర్థత ఉన్నటువంటివాడు నిదానంగా, నిశ్చలంగా, నిర్భయంగా వ్యవహరిస్తాడు. అటువంటి అజేయమైన, అపరపరాక్రమం సింహానికే చెల్లినది. ఇతర జాతి మృగాలకు ఉండే ఆధైర్యం అమితమైనది గనుక, అవి సింహంమీదకు తిరుగుబాటు చెయ్యవలెనంటే, ఎన్నో స్వజాతిమృగాలను వెంటబెట్టుకొని రావలసిన అవస్థ సంభవిస్తోంది.

మొన్న నీమధ్య హిట్లరు ఒక ఉపన్యాసం చేశాడు. ఆ ఉపన్యాసంలో, యింకా యుద్ధంచెయ్యవలసిన అవస్థ జర్మనీకి చాలా ఉన్నదని ఒప్పుకొన్నాడు. తనకంఠంలో ప్రాణం ఉండగా జర్మనీకి అపజయమనేది ఉండదన్నాడు. కాని, "నేను బ్రతికివుండగానే జర్మనీకి జయము నిశ్చయం." అనేమాట హిట్లరు నోటివెంట రాలేదు. చర్చిలు ప్రధాని ఎంతసేపు మాట్లాడినా, "అంత్య విజయం మనదే" అని సింహంలాగు ఘర్జిస్తున్నాడు. వారిద్దరు పల్కినమాటలలో చాలావ్యత్యాసంవుంది. హిట్లరు ఎన్నిగంటలు ఉపన్యసించినా, "జర్మనీ ఓడిపోవడం నేను బ్రతికివుండగా చూడను" అని ఘంటాపథంగా అంటున్నాడు. తాను చాలా గంభీరంగా మాట్లాడినానని హిట్లరు తనలో తాను అనుకుంటే అనుకోవచ్చు కాని, జర్మనీ చిట్ట చివరకు ఓడిపోతుందేమో అనే భయం సింహస్వప్నంలాగున హిట్లరుయొక్క మనస్సును పీకిస్తూనేవున్నది. లేకపోతే ఆ ధోరణిలో హిట్లరు నోటివెంట అటువంటి మాటలు రానేరావు. "మేము ఓడిపోము" అనేమాటలోనే ఓటమిమాట

ఉన్నది. “మేము గెల్చితీరెదము” అనే శపథం అసలైన ఉత్తమశూర లక్షణం గ్రామ సింహం మొరిగి మొఱపెట్టినట్లుగావుంది హిట్లరు ఉపన్యాసం. అసలైన సంగ్రామసింహం, గ్రామ సింహంలాగున ఆర్భాటం చెయ్యదు.

“జర్మనీ ఓడిపోదు” అనే మాట హిట్లరు అనవలసిన సందర్భ కారణంకూడా హిట్లరే వివరించుకొన్నాడు. “మహా ఐశ్వర్యవంతులైన వాళ్లతో ఏమీలేనివాళ్లు యీ యుద్ధం చేస్తున్నారు” అని చెప్పాడు. ఒకవైపున జర్మనీ, ఇటలీ, జపాను అనే మూడు రాజ్యాలూ కలిసివున్నాయి. వీటికి ఇదివరలో “అక్షరాజ్యాలు” అనే గొప్ప నామకరణం అతడుచేసాడు. “అక్ష” అనే సంస్కృత శబ్దానికి “యిరుసు” అని అర్థం. ఈ మూడు రాజ్యాలు కలిసి ప్రపంచానికొక పెద్ద యిరుసుగా ఏర్పడగలవనిన్నీ, ఆ యిరుసునే ఆధారంగాచేసికొని, ఆ యిరుసునే అండగా ఆశ్రయించుకొని, వాటి నీడక్రింద ప్రపంచంలోని యితర రాజ్యాలన్నియు బ్రతుకుతూ ఉండవలెననిన్నీ హిట్లరుయొక్క అభిప్రాయం.—అభిప్రాయమేకాదు. ఒక స్థిరసిద్ధాంతం.—అందుకనే ప్రపంచమునకంతకూ ఆధారభూతమైన సర్వలోకాశ్రయమైన అక్షరాజ్యాలుగా జర్మనీ, ఇటలీ, జపాను రాజ్యాలను తాను భావిస్తూ ఉంటాననియు, లోకముతోకూడా యీ మూడింటిని అక్షరాజ్యాలుగా భావించవలెననియు బాహాటంగా, ఆర్భాటంగా చాటించడం సాగించాడు. కాని, మొన్న చెప్పిన ఉపన్యాసంలో అఘోరణిగా మాట్లాడలేదు. “ఏమీలేని రాజ్యాలవాళ్లు అన్ని విధాలా అయిశ్వర్యవంతులైన రాజ్యాలతో యీ యుద్ధం చేస్తున్నారు” అని చెప్పుకొన్నాడు.

ఈ పర్యాయం చెప్పినమాటలోకూడా అర్థము ఉంది. ఇప్పుడు, ఇంగ్లాండున్నూ, అమెరికాయున్నూ, రష్యాయున్నూ, చైనాయున్నూ ఒక్క పార్టీగా చేరిఉన్నాయి. అమెరికా యొక్క అయిశ్వర్యము అంతులేని సువర్ణ వాహిని. పంటలు, లోహాలు, యంత్రశాలలు, ఆయుధ నిర్మాణం, విమాన నిర్మాణం, నౌకా నిర్మాణం, జన సంఖ్యాబలం, రాజ్య విస్తీర్ణం,— ఏది చూచినాసరే, అమెరికాతో సమాన ఉజ్జీగా సకల విధముల నిలువదగిన రాజ్యం లోకంలో లేదు. చైనాకు అప్పుగా అమెరికావారు 50 కోట్ల డాలర్లు యిస్తామని మొన్ననే ప్రకటించారు. 33 వేల యుద్ధ విమానాలు నిర్మించడానికి అమెరికా ప్రభుత్వం మొన్ననే 1,255 కోట్లడాలర్లు శాంక్షను చేసింది. నావలు నిర్మించడానికి 1,997 కోట్ల డాలర్లు శాంక్షను చేసింది. (డాలరు అంటే రూ 3-8-0 లకు సమానం.) ఆ విధంగా అర్బుదాలు నిర్బుదాలుగా కోటానకోట్లుగా ద్రవ్యం ఖర్చుపెట్టగలరాజ్యం ఇంకొకటి లేదు. ప్రపంచంలో బ్రహ్మాండమైన యుద్ధ నౌకాబలంగల రాజ్యాలలో ఇంగ్లాండు అగ్రస్థానం వహించి ప్రథమ తాంబూలం పుచ్చుకోగలదు. రెండోస్థానం అమెరికావారిది. మూడోది జపానుకు వస్తుంది. ప్రథమ స్థానం వహించిన ఇంగ్లాండున్నూ, ద్వితీయస్థానం వహించిన అమెరికాయున్నూ ఒక్కపార్టీలో చేరి ఉన్నాయి.

బ్రిటిషువారి సామ్రాజ్యం ప్రపంచమంతటా విస్తరించి ఉంది. ఆ సామ్రాజ్యంలో ఏదో ఒక భాగంలో ఎప్పుడూ సూర్యుడు ప్రకాశిస్తూనే ఉంటాడు. సూర్యుడస్తమించని యీ బ్రిటిష్ సామ్రాజ్యంలో బ్రిటిష్‌వారికి ఏ వస్తువులు కావాలంటే ఆ వస్తువులు పుష్కలంగా లభిస్తాయి. ఎంతజనం కావలెనంటే అంతజనం లభిస్తారు. ప్రపంచంలో ఏ నావలు ఏ సముద్రంలో తిరిగినా, బ్రిటిష్‌వారి ఏలుబడిలోను పలుకుబడిలోను ఉంటున్నటువంటి నౌకాశ్రయస్థానాలకు వచ్చిపోతూ ఉండకతప్పదు. అన్నింటికన్నా ఎక్కువైన విషయమేమిటంటే, బ్రిటిషువారికి బ్రహ్మాండమైన యుద్ధనావలు ఉన్నాయి. ఈ యుద్ధనావ ఒకొక్క సముద్ర సింహంలాగున తిరుగుతూ ఉంటుంది. ఫిరంగుల బురుజులతో సహా అమర్చబడిన ఒక పెద్ద ఉక్కుకోట సముద్రంమీద తిరుగుతున్నట్లుగా ఉంటుంది బ్రిటిష్ యుద్ధనావ. ఈ యుద్ధ నావలు సముద్రమార్గాల కన్నింటికీ, కాపుదలగా తిరుగుతున్నాయి. ఈ సముద్ర మార్గాలలో ఆయువుపట్టులవంటి కూడలి రేవులు, సముద్రాలమీద టోలుగేట్లులాగున ఉండే సముద్రమార్గ సింహద్వారములు, బ్రిటిష్‌వారి వశంలోనే ఉన్నాయి. ఆ సముద్ర సింహద్వారములు బ్రహ్మాండమైన కోటలుగా బ్రిటిష్‌వారిచే నిర్మింపబడి అక్కడ పెద్ద సేనలు, పెద్ద యుద్ధనావలు ఉంచబడినవి. అటువంటి సముద్రమార్గసింహద్వారాలలో సింగపూరు, సూయజుకాల్వ, జిబ్రాల్టరు చాలా ముఖ్యమైనవి. ఈ మూడున్నూ బ్రిటిష్‌వారి చేతనే రక్షింపబడుతున్నవి. ఇటువంటి ప్రబల సముద్రమార్గ సార్వాధిపత్యం ప్రపంచంలో ఏ రాజ్యానికీ లేదు. బ్రిటిష్‌వారికి యీ రోజున ఎన్నికోట్ల జనం కావాలంటే అన్నికోట్లమంది జనం లభించగలరు. ఆస్ట్రేలియానుంచి, కెనడానుంచి, న్యూజిలాండునుంచి, న్యూఫౌండులాండునుంచి, ఇండియానుంచి, ఆఫ్రికానుంచి పటాలములు వస్తున్నాయి. ఆయుధాలు కావాలంటే అమెరికాలోని ఫ్యాక్టరీలలో బ్రహ్మాండంగాతయారుచేసి సప్లయి చేస్తున్నారు. ఇటువంటి అంగబలం, అర్థబలం, ఆయుధబలం, సామ్రాజ్యబలం కలిగిన ఇంగ్లాండు, నేడు కుబేరునకుకూడా అప్పుయివ్వగల అమెరికారాజ్యంతో చేతులుకలిపి పోరాడుతోంది. ఒక్క ఇండియాలోనే యిప్పటికి 10 లక్షల కొత్త సేన మొదటి వాయిదాగా యుద్ధానికి తయారు చేయబడింది. ఇంకొక 10 లక్షల సేన సిద్ధమవుతూయున్నది. కోటి సైన్యం ఇండియాలో అవలీలగా తయారుకాగలదు. బ్రిటిషువారికి వున్నటువంటి సామ్రాజ్యంలో ఇటువంటి అంగబలం అపారంగా వుంది.

ఇక రష్యా విషయంలో చెప్పవలసిన పనిలేదు. ఐరోపా ఖండంలోని రాజ్యాల నన్నింటిని తన ప్రతాపానికి ఆహుతిచేసుకొన్నటువంటి జర్మనీ యొక్క సైన్యాలు గడచిన 9 నెలలనుంచీ రష్యాలో ఘోర యుద్ధం చేస్తున్నాయిగాని రష్యను సేనలను జయించలేకుండా వున్నాయి. గడచిన 10 రోజులలో తిరిగీ రష్యనులు 60 మైళ్లు ముందుకుపోయి, అదివరలో జర్మను లాక్రమించిన 400 గ్రామాలను తిరిగి తీసికొన్నారు. జర్మనులు పారిపోతూ మార్గమధ్యంలో విడిచిపెట్టిన ఫిరంగులు, టాంకులు, మోటారు లాగీలు, మందుగుండు సామానులు అపరిమితంగా రష్యనులకు అస్తి సంక్రమించినట్లుగా లభిస్తున్నవి. 26 వేలమంది జర్మనులు 10 రోజుల యుద్ధంలో చనిపోయినారు. రష్యావంటి బ్రహ్మాండమైన రాజ్యం ప్రపంచంలో లేదు. జన సంఖ్యా బలం ఎంతైనా వుంది. సైన్యం ఎంత కావలెనంటే అంత సిద్ధంగా వుంది. రష్యాకు ద్రవ్యం పుష్కలంగా వుంది. ఆయుధాలను అపారంగా క్రొత్త పద్ధతులుగా తయారుచేసిన రాజ్యం రష్యా.—రష్యాకు ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలిను చెక్కుచెదరని ఉక్కుముక్క. “స్టాలిను” అనేమాటకు “ఉక్కు మనిషి” అని అర్థం. అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఇంకొకటి వుంది. రష్యాలో యీ చలికాలంలో, ఆ రష్యనులే బ్రతుకగలరుగాని, ఇంకోదేశపు మానవుడెవడూ అక్కడ బ్రతకలేడు. ఆ చలికి ఆగలేనివాడు ఆ రాజ్యాన్ని జయించలేడు. ఆ చలిరాజ్యం చెలించేదికాదు. అది గడ్డకట్టిన రాజ్యం. ఇటువంటి రష్యా రాజ్యం, ఇంగ్లాండుతోను, అమెరికాతోను, ఏకమై చేతులుకలిపి, జర్మనినీ ఎదిరించి పోరాడుతూవున్నది.

ఈ రష్యా, ఇంగ్లాడు, అమెరికాలతో కలిసి చైనారాజ్యంకూడా నిలువబడింది. ఆసియా ఖండంలో చైనాకంటె పెద్ద రాజ్యం యింకొకటి లేదు. చైనాతో యుద్ధం జపానువారు ఎన్నేళ్లు చేసినా దానిని జపానువాళ్లు జయించలేకుండా వున్నారు. చైనా అంటే శత్రువుకు అలవికాని రాజ్యం. చైనాజాతి మొండి శిఖండిజాతి. చైనావాళ్లు కంఠంలోకొనయూపిరివున్నా, ఇంకాయుద్ధం చేస్తూనే వుంటారు. చైనాలో యీ వారంలో విజయం చైనా సేనలదే. జపాను సేనలు కాంటను వైపుకు పారిపోతూవున్నాయి. క్యాంగ్సేలో జపాను సేనలు ఓడిపోయినాయి. నాంచాంగ్‌లో జపాను సేనలు ఓడిపోయినాయి. చైనా సేనలు బర్మాలోనికికూడా వచ్చి జపాను సేనలను ఎదిరించుటకు సిద్ధంగా వున్నాయి. మలయాలో జపాను సేనలు చేసిన యుద్ధంలో 10 వేలమంది జపాను సైనికులు నష్టమైనారు. అందువల్ల చైనాలో జపానువారు ఇదివరలో మకాముగా వుంచిన సైన్యాన్ని మలయాలోనికి పంపించవలసిన గతి పట్టింది. 65 జపాను నావలు చైనాలోని యామాయి రేవుకు దక్షిణంగా పోతూవున్నవి. ఈ నావలలో జపాను సైన్యాలు చైనానుంచి మలయాకు పంపబడుచున్నవి. జపాను సైన్యాలను పీల్చిపిప్పి చేస్తున్న చైనాకు అమెరికా ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వంకూడా అనేక విధములుగా సహాయం చేస్తున్నవి. అమెరికా ప్రభుత్వమువారు చైనాకు 50 కోట్ల డాలర్లు అప్పు యివ్వడానికి నిశ్చయించారు. బ్రిటిషువారు 5 కోట్ల పౌనులు అప్పుయివ్వడానికి సంసిద్ధంగా ఉన్నారు.

బర్మాలోనుంచి చైనాకుపోయే రోడ్డు మీదుగా అపారంగా చైనాకు కావలసిన సరకులు, ఆయుధాలు బ్రిటిషువారు చైనాకు రవాణాచేస్తున్నారు. ఈ బర్మారోడ్డుమీదుగా రోజుకు 30 వేల టన్నుల సరకు రవాణా అవుతోంది. రోజు 1 కి 500 మోటారు లారీలు యీ రోడ్డుమీదుగా పోతూఉన్నవి. ఇటువంటి సహాయము అటువంటి చైనా ప్రజలకు చేయబడుతూ ఉండడంవల్ల, చైనా సేనలు బర్మాలోకి వచ్చి, బర్మాలోనికి జపాను సేనలు రాకుండా ఎదిరించుటకు నిలువబడినవి. బర్మాకు ఇంకా అధిక సైన్యసహాయం పంపబడుచున్నదనికూడా చర్చిలుగారు ప్రకటించారు.

ఈ విధంగా అమెరికా, ఇంగ్లండు, రష్యా, చైనా రాజ్యాలు ఏకమైనాయి. అనంతమైన, అంగబలం, అర్థ బలం, ఆయుధబలం పరస్పరంగా సప్లయిచేసికొనుటకు యీ రాజ్యాలుఏకమైనాయి.

జపానును జర్మనీని ఓడించుటకు ఎన్ని నావలైనా సరే, నిర్మించడానికి అమెరికా ప్రభుత్వం ఎన్ని కోట్ల ద్రవ్యమైనా సరే వెచ్చిస్తోంది. అమెరికాలో యీ నౌకాదళమునకు కావలసిన ఆయుధములను ఉత్పత్తి చేయుటకై అమెరికాలోని ఫ్యాక్టరీలలో పనివాండ్లు వంతులప్రకారం 24 గంటల కాలం పనిచేయవలెనని అమెరికా ప్రభుత్వ నౌకాశాఖకార్యదర్శి అన్నాడు. అమెరికను ఫ్యాక్టరీలు అహోరాత్రాలు పనిచేసి ఆయుధాలు ఉత్పత్తిచేసి అక్షరాజ్యాల అంతు కనుక్కోవలెననే ప్రతిజ్ఞ అమెరికా చేస్తున్నది. "ఇటువంటి బ్రహ్మాండమైన సంపన్న రాజ్యాలతో, ఏమీ లేని రాజ్యాలు నేడుయుద్ధం చేస్తున్నాయి. కనుక మా అక్షరాజ్యాలకు ఉన్నదీ లేదు, పోయేదీ లేదు" అని హిట్లరు మొన్న ఉపన్యాసంలో అన్నాడు. ఈ అక్షరాజ్యాలన్నీ కేవలం ముష్టి ఎత్తుకుంటూఉన్న అక్షయ పాత్ర రాజ్యాలు అనిన్నీ, విస్తార సామ్రాజ్యాలుగాని, అయిశ్వర్యముగాని కలవికావనిన్నీ, అమెరికా, ఇంగ్లాండు, రష్యా, చైనాల ముందు జర్మనీ, ఇటలీ, జపాను రాజ్యాలు కేవలం అక్షయపాత్ర చేతబట్టుకొనే రాజ్యాలనిన్నీ హిట్లరు తన నోటితో తానే చెప్పుకున్నాడు. తథాస్తు! అక్షరాజ్యాలనే నామకరణం ఏముహూర్తంలో హిట్లరు చేశాడో గాని, ఆఖరుకూ అవి అక్షయపాత్రరాజ్యాలు అనికూడా తానే అన్నాడు, మొన్నటి ఉపన్యాసంలో. ఈ అక్షయపాత్ర రాజ్యాలు అయిశ్వర్యవంతమైన అతి బలవంతమైన రాజ్యాలతో పోట్లాడడం సామాన్యమైన విషయం కాదని హిట్లరు ఖండితంగా అన్నాడు. స్పష్టంగా ఒప్పుకొన్నాడు. కాని, జర్మనీకూడా ప్రబలమైన ప్రయత్నం అందుకొరకై చేస్తోంది అని చెప్పినాడు. ఆ ప్రబల ప్రయత్నం ఏమిటంటే, జర్మనీవారు యిటీవల చాలా జలాంతర్గాములను తయారు చేశారట. ఈ జలాంతర్గాములన్నింటిని, అట్లాంటిక్కు మహాసముద్రంలో వేటకుక్కలు లాగున తాను వదలిపెట్టుతాడట. ఆ సముద్రమార్గములమీద సముద్రసింహములులాగున తిరిగే బ్రిటిషు యుద్ధనావలను, అమెరికను యుద్ధనావలను యీ జలాంతర్గాములు వేటాడి సంహరించడానికి విడిచిపెట్టుతానని హిట్లరు అన్నాడు. సముద్ర సింహాలకూ గ్రామసింహాలకూ జరిగే సంగ్రామం! అక్షయపాత్రరాజ్యాలు ఈ గ్రామ సింహాలను తయారు చేయవలసిందేగాని, సముద్ర సింహాల వంటి బ్రహ్మాండమైన యుద్ధ నావలను నిర్మించ లేవు.

బ్రిటిషువారి సముద్రమార్గ సింహద్వారాలలో చాలా ముఖ్యమైన సింహద్వారం ఏదంటే సింగపూరు. ఈ సింగపూరునువశపరచుకొని ఆక్రమించడానికి జపాను సేనలు మలయాలో అంతకంతకు ముందుకు చొచ్చుకొని, సింగపూరు వరకూ చేరుకున్నవి. కాని, సింగపూరు మీదకు దండెత్తడం సులభసాధ్యంగా కన్పించడం లేదు. సింగపూరు అనేది ఒక లంక. సముద్రం దాటి ఆ లంకలోకి పోవాలి. సింగపూరులంకలోకి, శత్రుసేన రావడం, కేవలం సింహపుగుహలోకి ప్రవేశించడం వంటిదే. ఆ సింగపూరులోకి దండెత్తి పోవలెనంటే జపాను సేన అపారంగా నష్టమవుతుంది. అందువల్ల సింగపూరువరకూ వచ్చిన జపాను సేనలు ఇంకా సింగపూరులో అడుగు పెట్టలేకుండా ఉన్నవి. సింగపూరును రక్షించడానికి అమెరికానుంచి 2 వేల విమానాలు పంపిస్తున్నారు. సింగపూరు రేవు బ్రిటిషు సింహానికి మకాము. జపానువాడు సింగపూరు దాటితే సింహళానికి రాగలడనే అభిప్రాయంతో సింహళంలో బ్రిటిషు సైన్యాలు బందోబస్తుగా సిద్ధంగా ఉన్నాయి. సింహళం కూడా బ్రిటిషు సింహానికి మకాముగా ఉంది.

కాని, సింగపూరుకు దక్షిణంగా ఉన్న జావా, సుమత్రా, బోర్నియో అన బడే, డచ్చి యీస్టు యిండీసు దీవులలోనికి జపాను తన సేనలను దింపుతూ యుద్ధం చేస్తున్నది. ఇకను దక్షిణంగా ఉన్న ఆస్ట్రేలియాకు దగ్గరగా ఉండే న్యూగినీ, న్యూబ్రిటను అనే దీవులలో కూడా జపాను సేనలు దిగుచున్నవి. అటుపైన ఆస్ట్రేలియా మీదనే దండెత్తవచ్చుననే సంకల్పంతో జపాను సేనలు దండయాత్ర సాగిస్తున్నాయి.

కాని, సింగపూరులో ఉన్న బ్రిటిషు సింహానికి జపానువాడు జవాబు చెప్పలేకుండా ఉన్నాడు. అటు చైనాలో, ఇదే సమయములో, చైనా సేనల ధాటికి ఆగలేక క్యాంటను వైపుకు హాంకాంగు వైపుకు జపాను సేనలు పారిపోతున్నాయి. ఫిలిప్పయిను దీవులవద్దను, మాకాసారు జలసంధివద్దను అమెరికావారి బలానికి జపాను నావలు ఆహుతిఅవుతున్నాయి. అచటి అమెరికను సేనాని పేరు మాక్ ఆర్థరుగారు. ఇతడు జపానువారి సేనలను నౌకాసమేతంగా సముద్రస్నానం చేయిస్తున్నాడు. ఫిలిప్పయిను దీవులలోని బాటాను ద్వీపకల్పంలోని పశ్చిమకోస్తాలో జపాను సేనలను దింపవలెనని ఒక పెద్ద జపానునావలముఠావచ్చింది. ఫిబ్రవరి 2 వ తేదిని యీ ప్రయత్నం జరిగింది. అర్థరాత్రివేళ రెండుసార్లు ప్రయత్నం జరిగింది. కాని, ఆరాత్రి అప్పుడే అమెరికను విమానాలు వచ్చి బాంబులువేసి అర్థరాత్రివేళ చొరబడుతున్న దొంగను చావగొట్టినట్లుగా ఆనావలను సైన్యంతో సహా ధ్వసంచేసినవి. ఒక్క జపాను సైనికుడు కూడా బాటాను ద్వీపకల్పంలో అడుగుపెట్టలేదు. అమెరికా, ఇంగ్లండు, చైనా, యీ మూడురాజ్యాలు ఏకమై పోరాడుతూవుంటే యీమూడింటికీ జపాను అనబడే ఒక్క అక్షయపాత్ర రాజ్యం జవాబు చెప్పలేదు. అమెరికా, ఇంగ్లండు, రష్యాలు ఏకమై ఎదిరిస్తూ ఉంటే, యీ మూడింటికి జర్మనీ అనబడే ఒక్క అక్షయపాత్రరాజ్యం జవాబు చెప్పలేదు. ఇక మూడో అక్షయపాత్ర రాజ్యం ఏదంటే ఇటలీ.—ఇటలీప్రభుత్వాధ్యక్షుడు ముసలోనీ—ప్రస్తుతం మూలనున్న ముసలమ్మ లాగుననే ముసలోనీ పడివున్నాడు. ఇటలీకి చెందిన లిబియా రాజ్యం ఉత్తరాఫ్రికాలో ఉంది. దీనిని బ్రిటిషు సేనలు ఆక్రమించకుండా కాపాడుటకుగాను అక్కడ జర్మనుసేనలు చేరి ఇటలీకి చెందిన లిబియాను ఆక్రమించుకొని "ముసలోనీ గారూ! మీకేం భయంలేదు మీరాజ్యం మేము కాపాడుతాము" అని ధైర్యమిస్తు న్నాయి. చివరకు అక్షయపాత్రకూడా చేతికిస్తారు. ప్రస్తుతం లిబియాలో జరిగే యుద్ధంలో బ్రిటిషు సేనలు వెనక్కిపోతున్నాయి. కాని, బ్రిటిషువారికి పోయిందేమీ లేదు. అందులో పోయేదంతా ముసలోనీగారిదే.

---

# సింగపూరు యుద్ధం.

## క్రొత్త సరకు నౌకాదళం వచ్చుట; పశిఫికు యుద్ధం గెలిచే సూచనలు.

జపాను సేనలు మలయా ద్వీపకల్పమును క్రమేణ ఆక్రమించుటచే, యీ వారంలో అచటనున్న బ్రిటిషు సేనలు మలయా దక్షిణకొననున్న సింగపూరు ద్వీపమునకు మరలవలసి వచ్చెను. దానితో మలయా యుద్ధం ముగిసి, సింగపూరుయుద్ధం పారంభమయింది. సింగపూరు నిలువగల్గునా? అనే ప్రశ్న ఇండియాలోనేగాక, చీనా, డచ్చి తూర్పు దీవులు, ఆస్ట్రేలియా, ఫిలిప్పైను దీవులన్నింటియందు అడగబడుచున్నది. సింగపూరు నిలుస్తుంది అని జబాబు చెప్పితే జపాను ప్రారంభంలోగెల్చిన గెలుపులకు అనుగుణ్యంగా వుండదు. కాని సింగపూరు నిలువక తప్పదు, నిలిచి తీరుతుంది. జనవరి 31 వ తేదిన మలయా యుద్ధం ముగిసి సింగపూరు యుద్ధం మొదలైందని సేనాధిపతి తెలిపెను. "మలయాలోను అత్యధిక సంఖ్యాగానున్న శత్రువిమానదాడి నెదుర్కొని, నిరాటంకంగా వచ్చుచున్న శత్రునౌకాదళమును గూడ ఎదుర్కొన, మిత్రమండలి సేనలు, యిపుడు

## కనడానుంచి వచ్చిన సైనికులు బ్రిటిషు రేవులో దిగుట.



బ్రిటిషు సామ్రాజ్యదేశాల కుటుంబంలోనివారు స్వాతంత్ర్యంకొరకు పోరాడుటకు ప్రపంచ సముద్రాలు దాటుచున్నారు.

---

ముట్టడి చేయబడిన సింగపూరుకోటను రక్షించుచున్నవి. ఇంకను ఎక్కువ సహాయం వచ్చువరకు యీ కోట పడిపోకుండ చూచుట మావిధి. సహాయం తప్పకవస్తున్నది. కోటను తప్పక రక్షింపగలము.'' అని సేనాధికారి యనెను. బ్రిటిషు రాజుగారు సింగపూరు ప్రజలకు ఉత్సాహం కలిగించు యీ దిగువ సందేశమును పంపిరి :—'' ఈ కష్ట సమయమున మీకును, సింగపూరులోనున్న నా ప్రజలకును, మీ మధ్య యిండ్లు కట్టుకొనియున్న చైనీయులు మున్నగు యితర దేశీయులకును సానుభూతి దెల్పుచు ధైర్యంగానుండ గోరుచున్నాను. తమను మించిన అధిక సంఖ్యగనున్న శత్రువుతో సామ్రాజ్య సేనలు ధైర్యంతో పోరుచుండగా, ఆ ద్వీపంలోనున్నవారందరు అట్లే ధైర్యంగా నుండురనుకొందును. మీ అందరి శ్రేయము నభిలషించుచున్నాను.''

సింగపూరు ఉత్తర తీరమునందేగాక, ఈశాన్య దిక్కున, పడమటి తీరాన, దక్షిణ తీరాన ఒక మైలు లోపుగానున్న సివిలు ప్రజలందరిని పంపివేసిరి. సింగపూరునకు మలయా దేశంలోని జహోరు సంస్థానమునకు మధ్యనున్న జలసంధికి అవల వైపునుండి సింగపూరుపై సరాసరి దాడిచేయుటకు శత్రువునకు కష్టసాధ్యమగును. అందుచే యీ ద్వీపాన్ని అన్నివైపుల చుట్టవేయాలనియే శత్రువు ప్రయత్నింపవచ్చును. ఉత్తరాన మలయా ద్వీపకల్పం వారిచేతులోనే యుంది. తూర్పుననున్న బోర్నియో ద్వీపంలోని వాయువ్యపు కొస జపాను వశమందుంది. పినాంగు వారిచేతులో నుండబట్టి పడమరగనున్న మలాకా జలసంధి మిత్రమండలి కుపయోగపడదు. అందుచే సింగపూరునకు ఆహారపదార్థముల సప్లైకి నౌకా మార్గము ఆశన్నలేదు. సుమత్రా ద్వీపం అడ్డంగానున్న మార్గం ఒక్కటే సింగపూరునకు మిగిలియున్నది. దక్షిణమున రియో దీవులగుండా వేరొక మార్గం సింగపూరునకు గలదు.

ఇపుడు చాల చిక్కుపరిస్థితు లేర్పడినవి. మిత్రమండలికి అనుకూల విషయము లిట్టున్నవి. జనరలు వావెలుగారు ఆ ప్రాంతముల సేనా నాయకుడుగ నున్నాడు. ఆలివరు స్టీవర్టుగారు జనవరి 22 వ తేదిన రేడియోలో యిట్లుపన్యసించిరి :—''శత్రువును ముందుకు పోకుండ నిలిపివేయగల అవకాశం రాకపోదు. అపుడు మనం తిరిగి కొట్టగలము. అది ఎప్పుడు, ఎక్కడ జరుగును అన్నది మన సైన్యాలకు అందగల సప్లైలపై నాధారపడియుండును. అపూరో యీ నగరమో ఎంతైనా సరే వదలరాదు అని ఆధునిక యుద్ధాలలో చెప్ప వీలు లేదు. జనరలు వావెలుగారు అచట నున్నారు గనుక అందరికి ధైర్యం నమ్మకం కల్గుచున్నది. సైన్యాల కృషికిని సప్లైలకు ఎంత దగ్గరసంబంధమున్నదో, అన్యోన్యాశ్రయ భావముందో వావెలుగారి చర్యలవల్ల యిదివరకే రుజువు చేసిరి.''

### క్రొత్త సరకు వచ్చుట.

ఇపుడు జపాను ఆక్రమించిన ప్రాంతాలపై అమెరికా విమాన దళములు, నౌకా దళములు, పెద్ద దాడులు ప్రారంభించినవని అమెరికా ముఖ్యపట్నమగు వాషింగుటననుండి వచ్చిన వార్తలు తెల్పుచున్నవి. అంటే అమెరికానుండి క్రొత్త సైన్యం పసిఫికు యుద్ధరంగానికి వచ్చింది, యింకా వస్తున్నదన్నమాట. రష్యాలో మాస్కో నగరంపై జర్మను లెట్లు దాడిచేసేరో సింగపూరుపై జపానువారు అట్లే దాడి ప్రారంభించిరి. రష్యాలోవలెనే మలయాలోగూడ రక్షించుకొనుచున్న సైనికులకు సప్లై మార్గాలు 50 మైళ్లవరకు తగ్గించబడినవి. అలాగానే క్రొత్త రిజర్వు సేనలు తెప్పించి సప్లై చేయబడెను. రెండు చోట్లను రక్షించుకొనుచున్న సైన్యమునకు స్థిరమగు మహా సైన్యము, విమాన విధ్వంసక ఫిరంగులతో వెనుక బలముగనున్నది. రాయలు విమానదళమునకు క్రొత్తగ సహాయం వచ్చినందున జహోరునకు దక్షిణమునందు, సింగపూరు దీవిపైని ఆకాశమంతను వశమందుంచుకొనగలదు. దానితో యుద్ధరంగంలో పరిస్థితులు మారిపోగలవు. కావున దూరమాలోచించుతే, పసిఫికు యుద్ధం గెలుస్తామని ధైర్యంగానుండుటకు ప్రబల కారణములుగలవు.

పసిఫికులో కొన్ని ఓటములు ఎందుకు జరిగినవో చర్చిలుగారు పార్లమెంటు ఉపన్యాసములో తెలిపిరి. ఇంగ్లాండు రక్షణకు, ఆఫ్రికా ప్రాంతములందు ఎక్కువ సైన్యమును ఉంచవలసివచ్చెను. అప్పటికి జపానుయుద్ధం ప్రారంభంకాలేదు. బహుశ ఎన్నడు రానటువంటి ప్రమాదంనుండి తప్పించుకొనే యుద్దేశంతో, యితరచోట్ల సైన్యాలను తగ్గించి వేరొకచోటికి పంపుట యుద్ధ నీతి కాదు. రాయలు విమానదళమునకు ముఖ్యమైన పనులు గలవు. రష్యా యుద్ధరంగంలో జర్మను సేనలకు సప్లయి పంపుచుండిన జర్మను నౌకలను ఇంగ్లాండు ఉత్తర సముద్రంలో కొట్టవలసియుంది. అట్లాం

టికు సముద్రంలో వచ్చుచున్న తమ సప్లయి నౌకలను కాపాడవలసియున్నది. బ్రిటన్ను అందలి విమానాశ్రయాలను రక్షింపవలసియుంది, జర్మను పరిశ్రమలను నాశనంచేయుటకు దాడిచేయవలసియుంది. ఆఫ్రికా తీరమున కైరోనుండి బెంగాజీవరకు విమానాధిక్యత నిలుపుకొనవలసియుంది. సిసిలీ ఛానలు, సిరియా, ఇరాను, ఇరాకు, పాలస్తీనా యివన్ని కాపాడవలసిన బాధ్యత రాయలు విమానదళమున కేగలదు. ఇట్టి పరిస్థితులలో 53,220 చదరపుమైళ్లు విస్తీర్ణంగల మలయ ద్వీపకల్పమునందు మిక్కుటంగా గుమిగూడియున్న జపాను విమానదళమును మించలేకుండెను.

ప్రస్తుతం పశిఫికులో విమానదళం, నౌకాదళం సంఖ్యలేమో తెలియకపోవచ్చును. కాని రాధారి మార్గాలు సరిగాయున్నవనియు, క్రమేణా క్రొత్త సరకు, సైనిక సహాయం వస్తున్నదనియు వార్తలు వస్తున్నవి.

---

## జపాను అనుకున్నట్లు జరుగలేదు.

## నౌకాదళాధిక్యత సందేహమే.

## హిందూ మహాసముద్రంలో వాణిజ్య మార్గాలు అడ్డే సూచన.

డచ్చి తూర్పుదీవులలో బోర్నియో సెలిబీసు దీవుల మధ్యగనున్న మకాసరు జలసంధియందు జపాను నౌకల గుంపుపై అమెరికా యుద్ధ నౌకలును విమానాలును డచ్చివారివిన్నీ తీవ్రమగు దీర్ఘదాడి జరిపి శత్రువునకు చాల నష్టము ఓటమి కలిగించెను. చాలయుద్ధనౌకలు, సైన్యాల రవాన నౌకలు జపాను వారివి ముంచబడినవి. దక్షిణ చీనా సముద్రాలందు జపాను తలపెట్టిన చాల ముఖ్యమైన యీ దాడిని మిత్రమండలి నౌకాదళాధికారి అడ్మిరలు హార్టుగారు నేర్పుతో కనిపెట్టి జయప్రదంగా నిరోధించిరి.

ఈ ఓటమి జపానుకు హెచ్చరికవలె నుండగలదు. ప్రారంభంలో జపాను గెల్చిన గెల్పులు కేవలం దుడుకుతనంతో వచ్చినవని తెలిసిపోయింది. అదివరకే చీనావంటి మహాదేశంపై యుద్ధం సాగిస్తూ గెలువలేకుండిన జపాను యిపుడు 400 మైళ్ల నిడుపుగల సముద్రరంగమున, ప్రపంచంలోకల్లా పెద్దవగు రెండు నౌకాదళములను సవాలు చేయుచు యుద్ధం ప్రారంభించెను, ఇంగ్లాండు నౌకాదళానికి యూరోపులోనే చేతినిండా పనియుంటుంది, ఏషియా యుద్ధంలోనికి ఇంగ్లాండు రాజాలదనిజపానీయులు భావించియుందురనడానికి సందేహంలేదు. కాని అత్యధిక సంఖ్యగానున్న అమెరికా నౌకాదళాన్ని ఎదుర్కొనడాని కెట్లు ధైర్యం వచ్చిందో తెలియకుండా వుంది. ఇక డచ్చి తూర్పుదీవుల ప్రభుత్వానికిగల విమానదళంగూర్చి వారు తలపెట్టనే లేకుంటే, వారి ఊహల్లో ఏదో గొప్ప పొరపాటుందన్నమాట. డచ్చివారు అతి సాహసవంతులు. తమ దీవుల సామ్రాజ్యమును 16 వ శతాబ్దంనుండి (300 ఏండ్లనుండి) అనేక యుద్ధాలలో రక్షించుకుంటూ వస్తున్నారు. అందుచే యిపుడుగూడ జపాను చర్యలకు చాల నిరోధం కలిగించగల్గిరి.

### జపాను నష్టాలు.

తూర్పు సముద్రాలందు మొదటి నాల్గు వారాల చర్యలో జపానువారు 2 పెద్ద యుద్ధ నౌకలను 3 క్రూయిజరు యుద్ధ నౌకలను, 9 డిస్ట్రాయరులను 5 సబుమెరైనులను, 31 రవానా సప్లై నౌకలను గోల్పోయిరి. ఇవిగాక కనీసం మూడు క్రూయిజర్లు, చాల సహాయనౌకలు బాంబులచేతనో టార్పెడోలచేతనో దెబ్బతిన్నవి. వీటికి అదనంగా మకాసరు జలసంధియందు మరికొన్ని నష్టపోయిరి ఇంతవరకు రెండు పక్షాలమధ్య జరిగిన తీవ్రయుద్ధం మకాసరువద్దనే. దీనివల్ల సమిష్టి రాజ్యాలనుకొన్న ప్రకారం సహచర్య కార్యములు జరిగితే తామెటువంటి నిరోధాన్ని ఎదుర్కోవాలో జపానుకి మచ్చు తెలిసింది.

మొదటి వారాలలో యీ చర్యలవలన నాలుగు వేలమైళ్ల సముద్ర రంగంలో జపాను చర్యలకు తీవ్ర నిరోధముండెనని రుజువయింది. ఇవి చిన్న సంఘర్షణలే. ఇంతమాత్రాన దక్షిణ సముద్రమున వెంటనే జపాను శక్తి కృంగిపోయిందనకోరాదు. కాని దీనినిబట్టి జపాను యుద్ధచర్యలు గూడ జపాను వస్తువులవలెనే క్రొత్తలో చూడ సొంపుగా నిండుగానుండి ఎక్కువకాలం నిలచి యుండలేవని స్పష్టమగుచున్నది. దూరదూరాన పదిచోట్ల జపాను సేనలు దిగుచున్నందున, వారికి యథేచ్ఛగ తిరిగే సౌకర్యముండునని కొందరనుకొనిరి. కాని నిజమదికాదు. సముద్రాధిపత్యము, ఆ ప్రాంతములందు స్వేచ్ఛావిహార సౌకర్యము యింకా ఎవరికీ చిక్కలేదు.

సముద్రములందు శత్రువుల నౌకాదళ శక్తి యెక్కువవున్నపుడు, తాము దూర ప్రాంతాలకు దాడి వెడలినచో స్వదేశంలో శిబిరాలనుండి సహాయంచేరుట కష్టమగును. ఇది సామాన్యయుద్ధనీతి దీనిని పాటించకుండా నిర్లక్ష్యంచేసి జపాను దాడి ప్రారంభించింది. ఇట్లుచేయబట్టే ఇటలీవారి ఆఫ్రికా సామ్రాజ్యం యీ యుద్ధంలోనే కూలిపోయింది. హిందూ మహాసముద్రంలోవాణిజ్య నౌకలను కొట్టే యుద్ధ నౌకలనుంచుటకు జపాను యత్నించుచున్నది. మలయా పడమరతీరాన్న పినాంగు ముట్టడిచేసి, దానికి దక్షిణంగానున్న స్పెటను హాము రేవును జపానువారు యీ వుద్దేశంతోనే వశపరచుకొన్నారు. రంగూనుపై విమానదాడులు కూడ అందుకే. సింహళమునందు ట్రింకోమలీ హార్బరునుగూడ పట్టుకుందామని జపాను ఆశపడుచునుండవచ్చును. నేడు వాణిజ్య నిర్మూలనమునకు తలపెట్టిన నౌకాదళమునందు జలాంతర్గాములును, అతివడిగా తప్పించుకపోగల నౌకలును గలవు. హిందూమహాసముద్రంలో నౌకలదోపిడి జరిగినచో మిత్రమండలి నౌకాదళాలకు చాల ఎక్కువ పని కల్గును. అందుకనే తూర్పు దీవులు శత్రువశంకాకుండా హిందూమహాసముద్రానికి కాపలా శిబిరాలుగా నుంచవలసియున్నది జపాను అచట స్థావరమేర్పరచుకొని, అమెరికా నౌకాదళాన్ని ఓడించాలని చూస్తున్నది. లేకుంటే మలాకా జలసంధికావల కొద్దిగ అప్రాముఖ్యపు దాడులు అప్పుడప్పుడు చేయగల్గును. హిందూమహాసముద్ర మార్గమును నిరోధించగల శిబిరమేదీ జపాను వశపరచుకోలేకుండా కాపాడాలనే మిత్రమండలి రాజ్యాలు స్థిరసంకల్పం చేసుకొన్నవి.

---

## హాంగుకాంగులో భారతీయ సేనల ధైర్య సాహసములు.

### ఒక చైనీయుని ప్రశంస.

చీనా తీరమునందున్న బ్రిటిషువారి దీవియగు హాంగుకాంగ్‌ను జపాను సేనలు ముట్టడింపగ 17 దినములు నిరోధించి చివరకు లొంగిపోయెను. ఆ ముఖ్యరేవు నగరమును రక్షించుటకు నియమింపబడిన సైనిక దళములలో పంజాబీ సిపాయిలు చూపిన ధైర్య సాహసములు, వారి చర్యల వివరములు, స్వయంగాచూచిన ఒక చీనా దేశీయుడు ఆ రేవునుండి తప్పించుకొని చీనా ముఖ్య పట్నమగు చుంకింగుచేరి వెల్లడిచేసెను. ఆఖరుకి లొంగిపోయేవరకు పంజాబీ సిపాయిలు ఘోరుగ పోరాడుచునేయుండిరనియు, భారతీయులు సివిలు ప్రజలు కూడ ప్రశంసార్హముగ ప్రవర్తించిరనియు అతడు తెలిపెను.

2/14 వ పంజాబి రెజిమెంటు, 5/7 వ రాజపుటు రెజిమెంటు శిపాయిలు కొండల ప్రదేశ

మగు కవులూను ఉత్తరభాగమునుండి మరలివచ్చి, నీరు దాటి, హాంగుకాంగులో చేరిన శత్రుసేనల నెదిరించి 17 దినములవరకు తెరిపిలేని యుద్ధంచేసి చివరకు లొంగిపోవలసివచ్చెను.

హాంగుకాంగ్-సింగపూరు రాయలు ఆర్టిలరీకి చెందిన పంజాబీలుకూడ ధైర్యముగ పోరిరి. జపాను సేనలు తమనుమించి ఎన్నోరెట్లు అధికంగానున్నవి. అయినను పంజాబీ సైనికులును ఉద్యోగులును చలింపక, అతిధీమాతో నేర్పుగ గుండుకు ప్రతి గుండు ప్రేల్చుచు శత్రువు నెదిరించిరి. విమానాలను కొట్టే ఫిరంగిదళాలందున్న వారి మిత్రులుగూడ సర్వదా శత్రువునెదుర్కొని పోరాడి తమ శక్తిసామర్థ్యములను చూపాలనే కుతూహల పడుచుండేవారు. ప్రత్యేక వ్యక్తుల వీరత్వం తెలిపే చర్యలు యింకను తెలియరాలేదు.

### సివిలు ప్రజల మనోధైర్యం.

భారతీయ సివిలు ప్రజలుకూడ ఎంతో ధైర్యం కలిగియుండిరి ? సుమారు 2,500 మందికి తక్కువలేరు. వారిలో కొద్దిమంది స్త్రీలు, బిడ్డలుకూడాను. అందు 1,500 మంది పంజాబీలు పోలీసు, జెయిలు నౌకాదళములకు చెందిన ఉద్యోగులు. జపానువారి నెదుర్కొనుట వీరిపని కానేకాదు. ముట్టడి జరిగియున్నంత కాలం యీ ప్రజల వైఖరి అధికారుల మన్ననబడసెను. చావంటే వారికి భయంలేదు. బాంబు ఫిరంగి గుండు తూటాలవల్ల రానున్న ప్రమాదాలేవో చూద్దామనే మనోధైర్యంతోనే వారు నిలచిరి. ఎవ్వరుగూడ శత్రువుల కుట్రలకు లొంగలేదు.

భారతీయ సివిలు ప్రజలలో ఎక్కువమంది కపాయం కలుగలేదు. 80 మంది కావలావారు కొద్దిమంది పంజాబీలు ఎగువదేశంలో ఉండిపోయిరి, కాని పోలీసుకి చెందినవారు, వారి కుటుంబాలు హాంగుకాంగు దీవికి తీసుకొనిరాబడిరి. అచట ఖాల్సా దర్బారు సహాయమున సిక్కు, ముస్లిము కుటుంబాల సహాయమున వారికి బసలు, భోజనాలు ఏర్పాటు చేయబడెను.

“ గురుద్వారా ” అంటే శిక్కుల దేవాలయం జపానువారి బాంబులకు గురియయ్యెను. ఒక శిక్కు, ఒక ముస్లిము చనిపోయి మరి ముగ్గురు గాయపడిరి. చేరువనున్న ఎ. ఆర్. పి. సందొకటి ‘ గురుద్వారా ’ ఏర్పాటు చేసుకొనుట కొసంగబడెను. అందులో స్త్రీలు, బిడ్డలు నివాసముండిరి. పురుషులు గురుద్వారా లంగరు (ఉచిత భోజనశాలనుండి) తిండితెచ్చి పెట్టేవారు. ప్రభుత్వం స్టోరునుండి 500 మందికి సరిపోవు భత్యాలు “ గురద్వారాకు ” ఉచితంగా యివ్వబడెను.

ముట్టడి ముగిసేసరికి చాలమంది భారతీయ సిపాయీలు, సివిలు ప్రజలు జపానువారిచేతిలో బడిరి. వారికి జపానీయులుచేసిన మర్యాద వేరు వేరు విధములగలదు. కొందరు చంపబడిరి. కొందరు దోచబడిరి. భారతీయులకు జపానీయులు మిత్రులేయను అభిప్రాయం కలిగించుటకై కొందరు కొద్ది అసౌకర్యములతో విడచిపెట్టబడిరి. కాని యీ అభిప్రాయం నిజంగా కలిగిందా అనుట సందేహమే.

---

# 7 వ ఇండియను బ్రిగేడు సైనికదళము.

## బెంగాజీనుండి తప్పించుకొన్న విధము.

**పట్టుబడిన జర్మను మోటారుల వెనుకనుండి జర్మనులవలె నటించి రోమెలుగారి సేనలను తప్పించుకొనిరి.**

ఆఫ్రికాలో సిరనైకాయందలి ముఖ్య రేవు స్థలమగు బెంగాజీని జర్మను సేనలు ముట్టడి చేసినపుడు అచట చిక్కుపడిన 7 వ భారతీయ బ్రిగేడు సైనికులు అతినేర్పుగ తప్పించుకొనిరి. వారు ఇటలీ ఆయాన దళము మధ్యనుండి తప్పించుకొనుటే కాక, జర్మను సైనికులనుగూడ మోసగించిరి. పట్టుబడిన జర్మను మోటారు బండ్లను వెంట తీసుకపోయి, ఇసుక తుపానులలో నడుపుకుంటూపోతున్నపుడు, వారి దళముకన్న పెద్దదగు జర్మను దళమును గాంచిరి. భారతీయ సైనికులొక్కమారు నిలచి, జర్మను మోటారులను ముందు బాగా అగుపడనట్లుగ వుంచి, వాటి చాటుగనుండి, తాము జర్మనులవలెనే నటించి, తప్పించుకపోయిరి.

వారెంత ధైర్యం చూపి, శత్రు సేనలను దాటి వచ్చిరో ఆ వివరములు యిపుడు తెలియవచ్చెను. ఈ బ్రిగేడు బెంగాజీకి తిరిగివస్తూవుండగ వెనుకనుండి శత్రు సేనలు తమనుచుట్టి వేసినట్లు తెలుసుకొనిరి. వారి నాయకుడు మోటారుకారులోనే ఒక సభచేసి ఆలోచించెను. శత్రు సేనలు ఎచట పలచగావున్నాయో, ఎచట అరక్షితముగనున్నవో అచట చేదించుకొని పారిపోవాలని నిశ్చయించెను. జనవరి 28 వ తేది సాయంకాలం సైనికులు దక్షిణంగాను పడమరగను మరలిపోవాలని ఉత్తరువు చేయబడెను. ఫిరంగులు ప్రేల్చరాదనియు, పొగ కనబడరాదనియు, శత్రువు తమపైన ప్రేల్చిన చెదరిపోరాదనియు, బండ్లను విడువరాదనియు, విమానాలు తమపై ఫిరంగులు ప్రేల్చినా వాటిని కొట్టరాదనియూ ఉత్తరువుచేయబడెను. శత్రువుల ఫిరంగులను నిర్లక్ష్యం చేసినట్లో, లేక గాయపడిన మిత్రులవలెనో నటించాలనుకొనిరి.

వానపడుచుండెను. దారి మెత్తబడుచుండెను, బురద చేరుచుండెను. రాత్రయింది. బండ్లు సైన్యాలు సాగుతున్నాయి. ఎల్ అగారువద్ద జర్మను సైనికదళాలు, వారున్నట్లే గమనించక వెడలిపోయినవి. మరునాడు పెట్రోలు చాలనందున కొన్ని మోటారులు చెడగొట్టి వాటిలో పెట్రోలు యితర బండ్లకు పంచబడెను. శత్రు సేన నాల్గు టాంకులతోగూడ అగుపడెను. కొంతసేపు పూరుకొని గుండ్లు ప్రేల్చెను. కాని భారతీయులకేమీ నష్టం కలుగలేదు, తిరిగి ప్రేల్చలేదు. తరువాత నెట్టి ప్రమాదం లేకుండెను. కొన్ని శత్రుసేనలగుపడెనుగాని, పెట్రోలు చాలనందున వారిని వెంటాడలేదు. వెనుక చూచుకుంటు మోటారులు నడుపుట చాల కష్టమయినపని. అయినా భారతీయ సేనలు అందుకు తగియున్నవి. కొన్ని మోటారులు సుమారు 200 మైళ్ళ వరకు యీడ్వబడినవి. త్రోవలో శత్రు విమానాలు కూడ అతి దిగువగ ఎగిరినవి. కాని వాటిపై గుండ్లు ప్రేల్చక పోవుటచే, ఏమీ తెలియక వెడలిపోయినవి. తిరిగి అవేవచ్చి గుండ్లు ప్రేల్చినవి. కాని బదులులేకపోయినందున, ఇండియా సేనను గుర్తుపట్టలేక వెడలిపోయినవి. బ్రిగేడు దళంలో కొందరికి జర్మను టాంకు దళమొకటి అగుపడెను. గుండ్లుకూడా ప్రేల్చినవి కాని ఎందుచేతనో ఏమి చేయక వెడలిపోయినవి. ఇండియను బ్రిగేడులో యింకో తెగ సైనికులను శత్రువుల కాపలా దళం ఎదుర్కొనెను. దానిని వారు ఓడించిరి.

### పనికొచ్చే వస్తువులు నాశనంచేయుట.

బెంగాజీనుండి చిట్టచివరకు, యింక రెండు గంటలకు శత్రు వాక్రమిస్తాడనగా, వచ్చిన ఆఖరు మనిషి భారతీయ సైన్యం వెంటనుండు ఒక విమర్శకుడు. ఆతడు 30 మైళ్ళ దూరాన ఉండగనే నగరంలో పొగ లగుపడుచుండెననెను. బెంగాజీలో శత్రువుకి ఉపయోగపడే సామానులన్ని కాల్చివేస్తున్నారని గుర్తించెను. పొగలోనే పూరు ప్రవేశంచేసరికి పూరంతా వదలివేయబడినట్లగుపడెను. రేవు స్థలంలో డాక్కులు నాశనంచేయబడినవి. చెడిన పడవలన్ని కుప్పలుపోసి హార్బరు రోడ్లపై మంటలు పెట్టబడెను. సివిలు ప్రజల కొరకు నీటిసప్లై చెడగొట్టకుండ వదలిపెట్టబడెను. శత్రువులకు యేమాత్రం ఉపయోగపడునని తోచిన సరకులును కట్టడములన్నియు దగ్ధం చేయబడినవి. అరబ్బులు బెంగాజీ విడచి రోడ్లపై పోవుచుండిరి.

# సైన్య విభాగములు.

సైన్యంలో కాల్బలము, మోటారు దళములు వేరువేరు శాఖలుగ విభజింపబడియుండును. అన్నింటి సమూహమును ఒక డివిజను అంటారు. దానిలో సాధారణంగా సుమారు 1,200 మంది సైనికులుంటారు. ఈ సంఖ్య స్థిరంకాదు. ఒకొక్క దేశానికి ఒకొక్క పరిమితిగలదు. కొన్ని రెజిమెంటులు చేరితే ఒక డివిజను. కొన్ని బెటాలియనులు బ్రిగేడులకన్న చిన్నది. కంపెనీ దానికన్న చిన్నది. దానికన్న చిన్నది ప్లాటూను. మూడు సెక్షనులు కలిస్తే ఒక ప్లాటూను.

సంఖ్యనుబట్టి క్రమవరుస యిట్లుండును :

డివిజను.
|
రెజిమెంటు.
|
బ్రిగేడు.
|
బెటాలియను.
|
కంపెనీ.
|
ప్లాటూను.
|
సెక్షను.

ఆధునిక మోటారు డివిజనులందు, టాంకుల శాఖ, ఆర్టిలరీ అంటే ఫిరంగుల శాఖ, ఇంజనీరుల శాఖ, సర్వీసు శాఖ, సిగ్నల్సు శాఖ, వైద్య శాఖలని వేరువేరుగానుండును. ఇవన్ని కలిసి ఒక డివిజను సైన్యం అంటారు.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]